శ్రీరస్తు.

# అద్వైత బ్రహ్మేశ్వరీ తారావళి

# अद्वैतब्रह्मेश्वरीतारावलिः

82

BY

**M. R. RY. B. Kodandapani Garu,**

SUB-REGISTRAR,

Cherukupalli, Guntur District.

PUBLISHED BY

**C. S. A. Narahari Rao, B.A.**



వెల రు. 0-2-0.

శ్రీ దేవ్యై నమః

---

ఈతారావళి వ్రాసిన మాబావగారును, మేనత్తకొమరుఁడునగు భువనగిరి కోదండపాణిగారు ప్రస్తుతము గుంటూరుజిల్లా రేపల్లెతాలూకా చెరుకుమిల్లి గ్రామములో సబురిజిస్ట్రారుగా నున్నారు. వీరికి సంస్కృతాంధ్రములయందు సమానమైన పుణ్యము కలదనుటకు సందియ మేమియు లేదు. ఇదివఱకు వీరు వ్రాసిన వానిలో రామశతకం బొక్కటి మాత్రము ముద్రితమయియున్నది. వీరు రచించినవి నాటకంబులు భాషాంతరీకరణంబులు ననేకములున్నప్పటికిని, నీకాలమున సాధారణముగా నచ్చునకు వచ్చుచున్న పుస్తకములలో మూడు వంతులకంటె నవి ముద్రణాయంత్ర సంస్కారమునకు నెక్కుడర్హతగలవియే యైనప్పటికిని, మాబావగారి విశేషలజ్జాస్వభావము వలననో, వారు తమ నమోనాగా నేర్పఱచికొనిన యుత్కృష్టశైలి నాయా గ్రంథములఁ గనఁబఱచి యుండలేదనియో, వారి కౌశల్యమునకుఁ దగిన సంపూర్ణ భావంబు లచ్చటచ్చట లేవనియో, వారు మాత్రము, వానికి నేఁటివఱకు ముద్రణాయంత్రదర్శనముఁ జేయు నదృష్టము దయచేయలేదు.

ఈ యాటంకము వీరి రామశతకమునకు మాత్ర మడ్డుపడ కుండెనేని యను సందియ మనతరించుటకు నవకాశము లేకపోలేదు. కాని వీరికొటుంబమున భక్తిజ్ఞానయోగములు ప్రసిద్ధిచెంది యుండుటవలనను, శ్రీరామభద్రుఁడు వీరి యిలువేల్పగుట వలనను, వీరిభక్తియే వీరి లజ్జాదుల నతిక్రమించి, రామశతకంబును దెరఁదీసి చూపఁగలిగినది. ఇదియునుంగాక వీరి తండ్రిగారు పట్టాభిరామ సోమయాజులుగా రగుటచే శ్రీరామునిపై భక్తితోఁ బితృభక్తియుఁ గలిసి రామశతకంబునకు వన్నెపెట్టుచున్నయది.

ప్రస్తుత మీతారావళి వెలువడుటకుఁగూడ నట్టికారణములే గనబట్టుచున్నయవి. మా పూర్వులకందఱకు నునికిపట్టగు గ్రామము, గుంటూరు

జిల్లాలో రేపల్లెకు మూడుమైళ్ల దూరముననున్న కారుమూరు. ఈ గ్రామములోఁ దోలుఁదొర్త వఝ్యమప్పయ్యశాస్త్రిగారు శ్రీమదాంగ్లేయాధికారుల మొదటి దినములలోఁ జాల ద్రవ్యము సంపాదించి పిల్లజమీందారునివలెఁ గాలక్షేపము సేయువారు. వీరు సమర్థులగు నేవురుపుత్రులఁ గాంచిరి. వీరిలోఁ దహశీలుదారు, పోలీసు ఇన్స్పెక్టరు పదవులఁగాంచిన వార లటుండ, మొదటి యిరువురుఁ జాల ఘనతఁజెందిరి. రెండవవారగు వఝ్యము కృష్ణశాస్త్రిగారు ఆకాలమున న్యాయవాదిగ నుండి, సమర్థులగు న్యాయవాదులకెల్ల కాలముల యందును ప్రత్యేకధర్మ మనంబడు ధనార్జనానైపుణ్య సంప్రమత్తతోఁజూపి ప్రవీణతం గాంచిరి. వీరు సంపాదించిన పొలములే వీరివంశము వారెల్ల రిప్పటికి ననుభవించుచున్నారు.

ఈ కుటుంబమునఁ బెద్దకుమారుఁడుగా జనించుటయే గాక నిజముగా నందఱిలోను మేరువుపూసవలె రాణించు శ్రీ వఝ్య మద్వైతపరబ్రహ్మశాస్త్రిగారు "ఈస్టు ఇండియా కంపెనీ"వారి సదరు అదాలటుకోర్టులో పండిత సదరు అమీను పదవి నలంకరించుటయు, ప్రస్తుతము ప్రౌన్స్ డిక్షనరి యను వాడుక పేరుగల నిఘంటువును రచించుటయందు వీరే ముఖ్యసహాయులగుటయు మాబంధుకోటిలో నందఱకుఁ దెలిసిన సంగతులే. వీరి పుత్రుఁడగు వాసుదేవపరబ్రహ్మశాస్త్రిగారు రచియించిన వ్యవహారదర్పణము గడచిన శతాబ్దాంతమువఱకు న్యాయస్థానములందు గౌరవింపఁబడియుంట లోకవిదితమే.

కాని అద్వైతపరబ్రహ్మశాస్త్రిగారి పేరు పౌరుష నామధేయమగుటయు నంతకుముందు వారు రామస్వామిశాస్త్రిగారగుటయు, వారు విద్యాభ్యాసముఁ జేసిన కాంచీపట్టణమునవారు మతేతరులతోఁ జర్చసలిపి యద్వైతసిద్ధాంతముల దృఢపఱచుటయు నందువలన వారికి గురువుగారీ పౌరుష నామంబిచ్చుటయు నేటి మాబంధుగులకుఁగూడఁ దెలియకపోవచ్చును.

ఇంతియే కాదు. వీరు కాలధర్మము నొందినపిమ్మట, వీరి ప్రియసోదరుండగు శ్రీకృష్ణశాస్త్రిగారు శోకానలంబున నొడలుదెలియక యున్నప్పుడు వారి దుఃఖ మడంచికొని రుద్రభూమిఁ బరీక్షింపుమను వాక్కొకటి వారికి వినఁబడటయుఁ గ్రిక్కియ వారటకేఁగఁ బరలోకగతు లగువారి యన్నగారియగ్ని సంస్కారములు సలుపఁబడినచోట నప్పటికే వెలసియున్న లింగాకృతి కానవచ్చుటయు నచ్చట నన్నగారిపేర కృష్ణశాస్త్రిగారు దేవాలయముఁ గట్టించుటయు, పిమ్మట నాపేరిట నద్వైతబ్రహ్మేశ్వరీదేవి విగ్రహము ప్రతిష్ఠఁజేసి మఱికొన్ని దేవాలయముల స్థాపించుటయు, నాయూరి దేవాలయములఁ బరీక్షించువారికెల్లరకు విశదమె.

తరువాత నీకుటుంబములయం దద్వైతబ్రహ్మేశ్వరీ, అద్వైతబ్రహ్మేశ్వరుల పేరులు సామాన్యంబుగ ననేక నామకరణంబులయం దుపయోగపడుటయు, నందుననే, యీగ్రంథకర్తగారితల్లికి గూడ నద్వైతబ్రహ్మేశ్వరి యను నామము గల్గుటయు, వేఱె చెప్పనక్కఱలేదు.

కనుక మాపూర్వుల గ్రామ మగు కారుమూరుపై నభిమానము చేతనో తమ మాతృభక్తిఁజూపుట కవకాశమిందువలనఁ గలుగుటనో, తమ తండ్రిగారి దేవ్యుపాసనమీఁది గౌరవముచేతనో, క్రిందటి వేసవిలో మేమందఱము కారుమూరునకేగి శ్రీ దేవీదర్శన మొనర్చినపుడు తాము రచియించిన యీతారావళిని మాబావగా రచ్చొత్తింప నియ్యకొనిరి. ఇది దేవతాభక్తియు మాతృభక్తియు, పూర్వులపై నభిమానముఁ జూపుటకు వ్రాయఁబడినదిగానఁ బండితపామరు లిందలి దోషములఁ బాటింపరని నమ్ముచున్నాము.

ఇట్లు

సుజన విధేయుఁడు

గుండు - సూర్యానంత నరహరిరావు.

శ్రీ ర స్తు

# అద్వైతబ్రహ్మేశ్వరీస్తోత్రము.

---

## తారావళి.

శా. శ్రీరామామణి భారతీరమణి సం
సేవింప నీచోపులన్;
స్వారాజ్యప్రభులక్ష్మియూడిగమొన
ర్పన్ దేవతాస్త్రీలు హ్రా
స్నిరేజప్రకటానురాగరవులన్
నీరాజనం బీయ లో
కారాధ్యప్రభఁ దేజరిల్లు జననీ
యద్వైతబ్రహ్మేశ్వరీ !

శా. లోకం బంతట నిండి లోకమును
నీలోనింపిదుర్జ్ఞేయమా
వీఁకన్ సాఁకెద వింద్రజాలమహిమ
ల్వేనోళ్లఁ గీర్తింపఁగా
మా కౌగాముల కెల్ల నేడుగడవై
మమ్మేలు మాతల్లి! ని
న్నాకర్ణించితిఁ గాని కాంచితిని నేఁ
డద్వైతబ్రహ్మేశ్వరీ ! 2

శా. ఏమార్గంబున వాసనల్నడపునో
యేదారి కన్ జూపునో
యేమర్యాదను గర్ణము ల్నిలుపునో
యేరీతి నోరాడునో
యేమాయన్ మతి ముంచునో యని మనం
బిట్టట్టు లూఁగన్ భయ
వ్యామోహంబు లడంగ నిన్నరయ నేఁ
డద్వైతబ్రహ్మేశ్వరీ ! 3

మ. విన నర్హంబగు సూక్తి వింటిని; మనో
వీథిం బ్రదర్శింప నె
ప్పిన దివ్యాదరనాదతత్త్వరుచులన్
వేవేల మాహాత్మ్యపుం
దొనలం దేలితి జాలితెమ్మెరల
నెంతో తోఁగితిం గాని నేఁ
డనఘానందమయాకృతి న్గనితినో
యద్వైతబ్రహ్మేశ్వరీ ! 4

శా. బాణోచ్ఛిష్ట మిదం జగ త్తనుగతిం
బ్రాపంచికప్రాభవ
ప్రాణం బై తగు నీదు తేజ మఖిలా
ప్త వ్యాప్తిచే నెల్లెడన్
రాణింపన్ నినుఁగంటి నిందనఁగ న
ర్థం బేమి మాయమ్మ! క
ల్యాణీ! బిడ్డల మేలుకొల్పఁగదవే
యద్వైతబ్రహ్మేశ్వరీ ! 5

మ. ఘనధర్మావనదీక్ష దుష్టజనశి
క్షణ శిష్టరక్షణ ఘనా
ఘనకారుణ్యహృదంతరాళవయి లో
కం బేల నీ వ్రేలిముం
గొనగోటం బురుషోత్తమాకృతి శతు
ల్కాండాడ లోకైకమో
హనలీలన్ విలసిల్లుతల్లివి కదా
యద్వైతబ్రహ్మేశ్వరీ ! 6

శా. ప్రజ్ఞానప్రసరన్మనోగతుల సౌ
భాగ్యంబునన్ దేలుస
ర్వజ్ఞప్రాకృతి, బోధ యింతయునఁ జూ
పన్రాని వేషంబుతో
నజ్ఞానావృతమై వెలుంగిడనిమాయన్
గూర్కు లోకంబు; నీ
యాజ్ఞాబద్ధము గాక వేఱు కలదే
యద్వైతబ్రహ్మేశ్వరీ ! 5

శా. పిన్నల్పెద్దలు మూర్ఖపామరమతు
ల్వేదాంతికవ్యగ్రణుల్
వన్నెల్వాసియు లేని మోటరులు సౌ
భాగ్యంబునన్ దోఁగు రా
కన్నెల్నీశరణంబు వేడఁగనె
వేడ్కన్ నీదు క్రీఁగంటిచూ
పన్నింటన్ గతి యా తెఱుంగుదురుసు
మ్మద్వైతబ్రహ్మేశ్వరీ ! 8

శా. ముద్దాపాపలఁ గాంచుజాలివగఁతో
మూల్లోకము ల్బ్రోచుమే
ల్విద్దె ల్నింపులసత్కటాక్షములతో
నిండైన క్రొందేనెచా
లున్దు గ్గొల్పుసుధీసుధారసముతో
సొంపైన నెమ్మోముతో
హద్దు ల్లేనివెలుంగుతోఁ జెలఁగెదో
యద్వైతబ్రహ్మేశ్వరీ ! 9

శా. వింత ల్చూపి వగ ల్మగు ల్గొలుపుచు
న్వభ్రాంతిఁ గీల్కొల్పి సు
స్వాంతంబుం దలక్రిందు చేసి తెలివిన్
భస్మంబుగా మార్చు వే
పుంత ల్బీయుతమంపుఁ జాయలను ని
ర్మూలంబు కావించు స
ధ్వాంత జ్యోతివి పాలనైకమతి ప్రో
యద్వైతబ్రహ్మేశ్వరీ ! 10

మ. రజనీనాథ దివాకరాద్యఖిలతా
రగ్రామబ్రహ్మాండముల్
సృజియింపన్ సమయింప సంపదల వా
సిం గూర్చి పోషింప వా
రిజబాణాయుతలీల నిష్కరుణ స
ద్ధీవ్రాతరక్షేచ్ఛతో
నజరుద్రాచ్యుతసేవలం దనిసెదో
యద్వైతబ్రహ్మేశ్వరీ ! 11

శా. విద్వత్సేవలఁ దాపసార్చనల సం
విత్పూజలన్ యోగధీ
మద్వీరార్చల మాంత్రికస్తుతుల సా
మప్రేమపుష్పాంజలిన్
విద్యోపాసనవిక్రమక్రమకళా
విఖ్యాతగీతాళిచో
నద్వైతావనకాంతులన్ గురిసెదో
యద్వైతబ్రహ్మేశ్వరీ ! 12

శా. యోధాగ్రేసరఖడ్గసంజనితవి
ద్యున్నాట్యరంగంబునన్
సాధూత్తంసమహోపకారకరుణా
స్వాంతప్రపంచంబునన్
స్వాధీనప్రతిభార్చితాద్భుతజనుః
ప్రజ్ఞానకేళిన్ సమ
స్తాధారం బగు నిరుచిం దెలిపెదో
యద్వైతబ్రహ్మేశ్వరీ ! 13

శా. ఉద్యద్భాస్కరమండలప్రతతి కా
యుస్తేజము ల్గూర్తువో
విద్యానాథనిరంతరప్రతిభ కా
వేశంబు గల్పింతువో
సద్యస్సత్యకవిత్వవాహినుల ని
చ్చల్ శ్రీలఁ దేలింతువో
యాద్యంతంబులు లేక భాసిలెదవో
యద్వైతబ్రహ్మేశ్వరీ ! 14

శా. చక్షుశ్శ్రోత్రములే పసుల్, శిశువులే
సంగీతసారస్యముం
దక్షుల్గ్రోలఁగ నన్న వాక్యము యథా
ర్థంబా? సమస్తప్రపం
చక్షేమోదయచిత్కళాశ్రుతిమనో
జ్ఞం బైనరాగంబుతో
నక్షయ్యంబుగ నెల్లరం దనిపెదో
యద్వైతబ్రహ్మేశ్వరీ! 15

శా. నీపై భక్తిరసప్రవాహమును వ
ర్ణింపంగ నాశక్యమే
నీపెం పారయలేని నాతలఁపులుం
నిం జూపఁగాలేని నా
చూపుల్ ని స్వనిపింప మైకొనని నా
శ్రోత్రంబులుం సాయ మౌ
నా? పాలింపుము నామనం బరసి యో
యద్వైతబ్రహ్మేశ్వరీ! 16

మ. కనదచ్ఛప్రభలుం గళంకమును రా
కాచంద్రబింబంబునం
బునరుద్దీపకరత్నముల్ జ్వలన మం
భోరాశిగర్భంబునం
బ్రణవాప్యాయదజీవనంబులును గ
ర్జారావ మభ్రంబునం
దనఘానందము నీపురిం గలుగు నో
యద్వైతబ్రహ్మేశ్వరీ! 17

శా. నీసేవామహిమంబు ముజ్జగము ల
న్వేషించు నర్థించుఁ జి
త్ప్రాసాదం బని నిత్యకల్పస్థమనః
ప్రాగల్భ్యమం చార్తర
క్షాసారథ్య మఁ టంచు నిన్ గనుట క
శ్రాంతంబు దిక్కంచు శ్రీ
వ్యాసర్షి స్తవనీయశక్తి యను చో
యద్వైతబ్రహ్మేశ్వరీ ! 18

శా. ఏకార్థక్షణకాలసంకలితసా
హిత్యప్రబంధంబు లు
త్సేకారాధనశాసితాఖిలజగత్
శ్రీ లొప్ప నిచిత్కళా
రాకాచంద్రిక వాసుదేవకవిస
మ్రాట్ఛ్ఛాగ్రమఁ దేలించె సా
ఖ్యాకల్పంబుగ నీపురిన్ నిలిచి యో
యద్వైతబ్రహ్మేశ్వరీ ! 19

శా. నీతేజంబు ప్రతిక్షణంబున మహా
నిర్వాణసంధానమై
చేతఃపాలనచిద్విలాసమున ని
శ్చింతన్ విడంబింపఁగా
మాతల్లీ ! బహురూపముల్ నిలిపె ద
మ్మా ! లక్షలన్ గోటులన్
యాతాయాతజనుఃపరంపరల నో
యద్వైతబ్రహ్మేశ్వరీ ! 20

మ. నిఖిలానన్యరమాకృపాయతనవా
ణీనర్తనక్రీడ లే
సఖులై లో వెలిఁ దాండవింప సకలై
శ్వర్యప్రభాభానుమ
న్ముఖమై పావనపావకాత్మగతమై
నూత్నాంచదానంద మా
నఖిలోత్తేజము నీసదన్వయము సు
మ్మద్వైతబ్రహ్మేశ్వరీ ! 21

శా. ఆదిత్యుండు త్రిమూర్తిసార మని సా
ష్టాంగప్రణామంబులన్
యాదోనాయకుఁ డాదిదేవుఁ డని స్నా
నార్ఘ్యోపచారంబులన్
వేదార్థం బెఱిఁగించు శేషుఁ డని సం
విద్ధ్యానగీతిన్ బ్రజల్
హా! దిక్కౌ నినుఁ గాన కల్లరయుచుం
ద్రద్వైతబ్రహ్మేశ్వరీ ! 22

మ. అచరాడంబరమూర్తితో ననఘ ది
వ్యానఘ్యన్ తేజంబుతో
రుచిరానందకథావిధానలహరీ
ప్రోద్యత్సుధావృష్టితోఁ
బ్రచురానంతమహాసుధీప్రతిపదా
ప్తశ్రేణితో నీపురం
బచలాభన్ వెలుఁగొందు వైభవముతో
నద్వైతబ్రహ్మేశ్వరీ ! 23

శా. నీవే రెన్నఁగ, నీవె దలంపఁగను, ని
న్నే కోరి పూజింపఁగా
నీపై దృష్టిని నిల్పి నిన్నరయఁగా,
నీరూపుఁ గీర్తింపఁగా
మాపాలన్ గల వేల్పుకల్పకము వై మ
మ్మేలు మాతల్లి! మా
వ్యాపారంబుల మమ్ముఁ బ్రోచెదవు సు
మ్మద్వైతబ్రహ్మేశ్వరీ! 24

మ. అపరాధంబుల సల్పఁ బో ననుచు ని
న్నర్థింపరాలేదు; బల్
విపరీతంబులఁగూర్చి నిన్నిపుడు క
వ్వింపంగరాలేదు; ని
న్నుపహారంబులఁ దృప్తఁ జేయఁ గల
నంచూరింపరాలేదు; సా
యపడం దల్లివి సత్కృపన్ మనుపు మ
మ్మద్వైతబ్రహ్మేశ్వరీ! 25

శా. నీవే రన్నను, నీదుకోవెల యనన్,
నీసామగానం బనన్
నీపర్వం బన, నీపురాణము లనన్,
నీయూసు, నీకొల్వనన్
పాటల్వోలెఁ జెలంగు చాడెదు జగ
ద్వ్యాపారకీరాళి నిం
పౌపాఙ్గోలలఁ బ్రోదిచేయుజననీ,
యద్వైతబ్రహ్మేశ్వరీ! 26

శా. నాతాత్పర్యము, నాదుబంధులనుతుల్,
నాతల్లి నాతండ్రిపూ
జాతీర్థంబు, పురాణదంపతుల తే
జస్స్ఫూర్తి; కావ్యార్థ; మ
ద్వైతానంద నదీ కదంబ కమలా
వ్యాసక్తి, శ్రీ వాసుదే
వాతుల్యప్రతిపత్తి; నిన్నరయునో
యద్వైతబ్రహ్మేశ్వరీ! 27

---

మ. మఱవన్ జాలనియుగ్గుతోఁ గుడిపెఁబో
మాయమ్మ నీపేరు, నన్
నెరసుల్లేని ప్రపత్తి మాజనకుఁ డెం
తేఁ గొల్చె నీపేరునన్,
కొఱంత ల్బాపెడు నీ నుతిన్ సలిపితిన్
గోదండపాణిన్ జగం
బరయన్ దల్లివి తండ్రివై మనిచెదో
యద్వైతబ్రహ్మేశ్వరీ!

---

క. మనబంధుసంతతికి గురు
వనఁ దగి మేత్తైర వాసరగు హరు సతి కార్యా
రున నుండి జగము లరసెడు
జననిఁ గనఁగ నేగి సంత సమ్ముపొంగన్.
క. కొలలేని వెలుఁగుఁ గృప నె
క్కొలుపుచు మేల్కొలిపి యెదుటఁ గొలువొప్పఁగ నై

పులకింపఁ బరవశానం
దలహరి నోలార్పఁగఁ మదంబుఁ గంటిన్.

చ. అమలమనీషఁ దేర్చు కరు
ణామృతవాహిని వెల్లికొల్పఁ, దే
జము జగ ముద్ధరింప, సహ
జం బగు ప్రేమ గడల్గొనంగఁ, బ్రా
ణములకుఁ బ్రాణమౌచు భువ
నంబులకుఁ జననీప్రబోధ మౌ
యమకోలు విచ్చు హాయి విని
యుండియుఁ గాంచితిఁగన్ను పండువుగ

గీ. కనినఁ గనినట్టు లుంకును గరుణ గదుర
వినఁగ వినినట్టు లుంగును వీను లలరఁ
గనఁగ వినఁగను దగుమమ్ముఁ గన్నతల్లి
కనదె వినదే విపన్నుల కల్పవల్లి.

గీ. సుతుల పొరపాటులఁ బ్రేమఁ జూపి దిద్ది
తప్పు లడఁగించి మెప్పు లాత్మజుల కొసఁగి
కళలఁ జవిచూడ శ్రీల బిడ్డలకుఁ గూర్చు
తల్లి నుతియింప వెనుదీయు నుల్ల మున్నె?